వసూలుచేయుచు అనేక వందల గ్రంథములను గ్రంథాలయమునకు తెప్పించి సభ్యులు, ఇతరులు చదువునటుల చేసెను. దినపత్రికలు వారపత్రికలుసహా తెప్పింపబడుచుండెను.

## సేవావ్రతము.

మూడు స్థలములందు ప్రత్యేకముగ ఉపాధ్యాయులను వేతనములపైన నియమించి రాత్రి పాఠశాలలను జరుపుచుండెను. గ్రంథాలయమున ఉచితముగా నేత పరిశ్రమ గఱపునటుల ఏర్పాటుచేయబడెను. శ్రీ దాసుగారు స్వయముగా నేత నేర్చుకొని, విద్యార్థులకు నేర్పుచు, కాయకష్టమునందుగల గౌరవమును ప్రస్ఫుటించిరి. బాలభటోపాధ్యాయ శిక్షను కోడూరుగ్రామమున-ఆంధ్రరాష్ట్రీయ బాలభట నాయకులగు అయ్యంకి వేంకటరమణయ్యగారిచే నిర్వహింపబడిన శిక్షా శిబిరమునందు, వీరును యం. వెంకటరమణప్పగారును పొంది గ్రంథాలయముతరపున శ్రీయుత పి. నారాయణశాస్త్రిల వారి అధ్యక్షతక్రింద బాలభటపటాలముల నేర్పాటు చేసి మిక్కిలి జయప్రదముగా నిర్వహించిరి. దాసుగారు ప్రధానోపాధ్యాయులుగా నుండి - రాత్రిపాఠశాలలందు చదువుచు పగలంతయు కూలివల్ల జీవనము చేయు సామాన్యవిద్యార్థులకు బాలభటశిక్షణచక్కగా గఱపిరి. ఇవన్నియు చక్కగా జరుపబడుచున్న దినములలో ప్రభుత్వోద్యోగులలోకాని, ప్రజలలోకాని తప్పు చేసినవారు బాలభటులకు మిగుల భయపడుచుండిరి. బాలభటులు ఎక్కువగా చదువుకొన్న వారుగాక పోయినను తన అధికారి ఆజ్ఞలను చక్కగా నిర్వర్తించువారై యుండిరి.

## మండలగ్రంథాలయసభ

ప్రథమ అనంతపురమండల గ్రంథాలయ సభను 1920 నందు ఆహ్వానించి మిక్కిలి జయప్రదముగ నిర్వహించిరి. శ్రీ రామమోహన గ్రంథాలయము యొక్కయు, బాలభట పటాలముయొక్కయు, వార్షికోత్సవములనుగూడ జరపిరి.

## గ్రామస్థులందు జ్ఞానోదయము.

వీరిచే నిర్వహింపబడుచున్న వివిధ సంఘములవలన ఉరవకొండ గ్రామమునందున్న అశేష జనమునందును జ్ఞానోదయము కలిగినదని చెప్పిన అతిశయోక్తి ఎంతమాత్రమును గాదు. వీరు గ్రామస్థు లందరియందును తలలోని నాల్కవలె మెలంగుచు అందరియొక్క మన్ననను పొందుచుండిరి.

## ఉద్యోగము పోయినను ధైర్యమును వీడలేదు.

ఇటుల పరోపకార పారీణులై పాటుబడుచున్న సమయమున గరల్ స్కూలు ఉపాధ్యాయ పదవి నుండి తొలగింపబడిరి. అయినను ఎంతమాత్రము నధైర్యమును జెందక తాను స్వంతముగా మగ్గము పెట్టి నేత నేయుట మొదలిడి జీవనమును గడపసాగిరి. మరి రెండు మగ్గములుకూడ చేర్చి పనిని ఎక్కువగా సాగింప మొదలుపెట్టిరి.

ఇదంతయు నిటులుండ మహాత్ముని సత్యాగ్రహోద్యమము ప్రారంభమాయెను. కాంగ్రెసునందు శ్రీ దాసుగారుసహా సభ్యులుగాచేరి ప్రచారము మొదలు పెట్టిరి. వెంటనే గ్రంథాలయ యావదాస్తులను వురవకొండ కారనేషన్ రీడింగురూమున చేర్చబడెను. శ్రీ రామమోహన గ్రంథాలయము, కారనేషన్ రీడింగురూము అను పేరుతో నేర్పరుపబడెను. పిమ్మట కల్లు అంగళ్లయొద్ద పికెటింగు చేసి జెయిలునకుగూడ బోయిరి.

## నేతగాండ్ర సంఘము.

జైలు అనుభవము ముగిసినతర్వాత కాంగ్రెసు ప్రచారమునందే చాలకాలము గడపిరి. సత్యాగ్రహము లేనికాలమున వురవకొండ గ్రామము నేతపరిశ్రమకు పేరుగాంచినది గనుక, బీదసాదలు బ్రతుకుటకు అనువగునటుల నొక నేతగాండ్ర సహకారసంఘము నెలకొల్పిరి. 13 వేల మొత్తము షేర్లమూలముగా జమ చేయబడి 25 వేల రూప్యములవరకు బ్యాంకునుండి తెప్పించి ముడిసరుకులను కొని-యిచ్చుట తయారైన చీరలను కొనుట వానిని అమ్మకముచేయుట ఏజంట్లను నియమించుట మొదలగు పనులు జరుపుచుండెను. ఒక వత్సరమున 1 లక్ష రూప్యములకు పైబడి బేరము జరుపబడెను. కాని యుత్పత్తిచేయు సరుకులు అమ్మకముఅగు మార్కెట్టులేకను, విదేశీ పోటీలవల్లను తయారైన జవళీ ఖర్చుగాక నిలిచిపోయినందున స్వదేశీకి రక్షణ కలుగువరకు నీ యుద్యమమును సక్రమముగా జరుపుట కష్టమని-వ్యాపారపద్ధతిమానుకొని, అప్పు లిచ్చు పద్ధతి మాత్ర మిప్పుడు ఉంచబడినది. దాసుగారీ యుద్యమమం దెక్కువగా కృషిసల్పిరి.

# విషయసూచిక

### దుకాణము.

వీరు, జీవనోపాయమునకు వేఱుతెరవుగానక ఒక దుకాణముపెట్టి జరుపుచుండిరి. ఇంతలో అనంతపురమండలమున ప్రభుత్వమువారివల్ల ఏర్పరుపబడిన మద్యపాన నిషేధప్రచారమున చేరి ఒక సంవత్సరకాల మింతు పనిచేసిరి. వీరు పెన్నహోబిలమున రథోత్సవకాలమున అంగడివాండ్రు మొదలగువారికి సౌకర్యముగా స్థలములను నిర్ణయించుట మొదలగువాటియందు ధర్మకర్తల కెక్కువగా తోడ్పడిరి.

### మృతి.

వీరు అకస్మాత్తుగా జ్వరబాధవల్ల ౧౯౩౭ సంవత్సరము మేనెల 9 వ తేదీన స్వర్గస్థులైరి.

వీరు చిన్ననాటినుండియు స్వదేశదీక్షయుండే యుండువారు. బీదలయెడ చాలదయగలవారు. చాల ధైర్యవంతులు, పట్టుదలగలవారు, చిన్ననాటినుండి బీదతనమును ఆనందముతో అనుభవించినవారు. వీరు కడవరకును పరోపకారమైన పనులు చేయుటయందే తన కాలమునంతను గడిపినవారు.

తాను బ్రతికియుండగనే తన బిడ్డలకు వివాహములు జేసెను. వారు వారివారి భర్తల జేరుకొనిరి. దాసుగారికి 5 యేండ్ల బాలుడు, భార్యయు నిరాధారులై నిలిచినారు.

ఉరవకొండ,<br>అనంతపురంజిల్లా. } ఘుట్టి వెంకటరమణప్ప.

# సంపాదకీయములు.

### గ్రంథాలయోద్యమ సేవకులు.

ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునకు పట్టుకొమ్మలై, ఈ యుద్యమ విజయమునకుగాను పాటుబడిన గ్రంథాలయోద్యమ సేవకుల జీవితచరిత్రలను ప్రకటించవలెనని సంకల్పించినాము.

అట్టి సేవకులలో నొకరగు అనంతపురంజిల్లా ఉర్వకొండ గ్రామ గ్రంథాలయ సేవకులగు శ్రీ బెళ్గాం రామదాసు నాయుడుగారి జీవితచరిత్రను ఈ సంచికయందు ప్రకటించినాము. వీరిపటమును ముందు సంచికయందు ప్రకటింపగలము.

### సంచార గ్రంథాలయములు - కృష్ణాజిల్లాబోర్డు

కృష్ణాజిల్లాబోర్డు సభ్యులును, దక్షిణభారత గ్రంథాలయసంఘ ఉపాధ్యక్షులును, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ సహాయకార్యదర్శినియునగు శ్రీమతి తుల్లపాటి రాజరాజేశ్వరమ్మగారు జిల్లాబోర్డు సభయందు ఉపపాదించుటకై ఈక్రింది తీర్మానమును పంపిరి:—

"ఈజిల్లాలో రెండు కేంద్రస్థలములయందు మాదిరిగా పనిజేసి చూచుటకై సంచార గ్రంథాలయములను ప్రారంభించుటకు తగు ఏర్పాటులను చేయుటకుగాను రు 600 లను మంజూరుచేయుమని తీర్మానించడమైనది. అవి గుడివాడ తాలూకాలో అంగలూరునందున్నట్టియు, నందిగామతాలూకాలో కొణకంచియందున్నట్టియు గ్రంథాలయములతో సహకారముగ ఆతాలూకాలలో పనిచేయగలయును."

కృష్ణాజిల్లాబోర్డునకు అధ్యక్షులగు శ్రీరాజా యార్లగడ్డ శివరామప్రసాద బహద్దరుగారు-క్రిందటి సంవత్సరమున బెజవాడలో జరిగిన అఖిలభారత గ్రంథాలయ మహాసభకు అహ్వాన సంఘాధ్యక్షులును, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు ఉపాధ్యక్షులును అయియున్నారు. గ్రంథాలయోద్యమము యెడల గాఢమైన అభిమానము గలవారు. వీరి పరిపాలనయందు ఈతీర్మానము అమలులోనికి వచ్చుటయేగాక జిల్లాయందంతటను గ్రంథాలయోద్యమమునకు మంచి సహాయము లభింపగలదు.